# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 11 | రాజమహేంద్రవరము 1-1-1988 | సంచిక 4, 5


## ఈ సంచికలో



రాబోవు సంచికలో – శతకంఠరామాయణము – ఒక పరిశీలన, వె. రా. హంస సందేశము, బాపిరాజుపై జరిగిన జరగవలసిన పరిశోధనలు, వరూథిని, కాటన్ మహర్షి మొదలగునవి ఉంటాయి.


1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా : సంవత్సరమునకు రు. 12.00.
అర్ధసంవత్సరమునకు రు. 6.50.

విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ ఖులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry·


## ఆంధ్ర సాహిత్యంలో ప్రార్థిత స్వప్నాలు

కావ్యరచనకు పూర్వం కవికి తన ఇష్టదైవం, లేదా తమవంశ పూర్వీకులు లేదా, తనకు గౌరవస్థానీయులైన వ్యక్తు లెవరైనా కలలో కనబడి ఫలానా కావ్యాన్ని రచించ వలసిందని కాని, దాన్ని తన కంకిత మీయవలసిందని కాని కోరినట్లయితే, ఆ స్వప్నాన్ని 'ప్రార్థిత స్వప్న' మంటారు. మన తెలుగు సాహిత్యంలోని కొన్ని కావ్యాల పుట్టుకకు కారణ మీ ప్రార్థితస్వప్నాలే! అటువంటి ఘట్టాలను కొన్నింటిని గురించి ఈ వ్యాసంలో తెలుసుకొందాం!

ఆంధ్రమహాభారతంలో ఆవిరాట స్వర్గారోహణాంతమున్న పదిహేను పర్వాల నేక ఘంటంతో 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ' రచించిన కవి బ్రహ్మ తిక్కన సోమయాజి.

తిక్కన తాను వ్రాయబోతున్న ఆపవిత్ర ప్రబంధమండలి నెవరి కంకిత మిద్దామా? అని ఆలోచిస్తూ కలతనిద్ర పోతున్న సమయంలో అతని తండ్రి కొమ్మనదండనాథు డతనికి స్వప్నసీమలో సాక్షాత్కరించి, 'భక్తవత్సలుడైన హరిహర నాథుడు నీపట్ల దయాళుడై ఒక పని మీద నీ వద్దకు రాబోతున్నా' డని చెప్పాడు.

ఇంతలో హరిహరనాథు డక్కడికి వచ్చాడు. తిక్కన ఆ సర్వేశ్వరుడికి సాష్టాంగ ప్రణామ మాచరించాడు. అత డద్వైత భక్తి తత్పరుడైన తిక్కనను చూచి మందహాసం చేసి, 'నీవు నిర్మించబోతున్న భారతేతిహాసానికి నన్ను కృతిపతిని చేయవలసిందిగా అభ్యర్థించటానికి వచ్చా' నన్నాడు.

పారాశర్యుని కృతి యయి
భారత మను పేరఁబరఁగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద
ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్.
తెను గుబాస వినిర్మింపఁ దివురుటరయ
భవ్య పురుషార్థ తరుపక్వఫలము గాదె
దీనికడ నియ్య కొని వేడ్కనూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కకర్య!

—భార. విరాట. 1-17,18.

ఆ అఖిలాండ పతి అభ్యర్థనను విన్న తిక్కన తన జన్మజన్మాంతర దుఃఖాలను తొలగఁ జేయవలసిందిగా అతడిని ప్రార్థించాడు. హరిహరనాథు డను గ్రహించి అంతర్ధాన మయ్యాడు.

కొద్దిసేపటికి తిక్కనకు మెలకువ వచ్చింది. అతడు తనవంటి సామాన్యుడి కంతటి ఉత్తమ పదప్రాప్తి కలిగినందుకు పరమానంద సంభరితుడై, భారతరచన కుపక్రమించి సమస్త దురితాపహమూ, అభిమత శుభావహమైన ఆ 15 పర్వాలను 62 ఆశ్వాసాల, 16048 గద్య పద్యాల పరిమితంగా రచించి, హరిహర నాథుడి కంకితం చేశాడు.

భారతీయ ముముక్షుజనహృదయ క్షేత్రాలపై గీర్వాణభాగవతసుధను ప్రవహింప చేసి, ముక్తిసస్యాన్ని పండించిన భగవానుడు వేదవ్యాసమహర్షి. అతడి భాగవతాన్ని 'నభూతో నభవిష్యతి' అన్నట్లు అనితరసాధ్యంగా ఆంధ్రీకరించిన భక్తకవివరేణ్యుడు బమ్మెర పోతన.

అతడు శ్రీమన్నారాయణ గాథల నొక కావ్యంగా వ్రాద్దామనుకొన్నాడు. ఒక నిండు పూర్ణిమ నాటి చంద్రోదయ సమయాన గోదావరీనదికి వెళ్ళి, స్నానమాచరించి, నదీతీరాన శ్వేతసైకతం మీద పద్మాసనస్థుడై మహేశ్వరధ్యానం చేస్తున్నాడు ఆ సమయంలో మెరుగు చెంగట నున్న మేఘంలాగ సీతాదేవిసమేతుడైన శ్రీరామ చంద్రుడతనికి భావనాప్రపంచంలో కనబడి, 'వ్యాసమునీంద్ర కృతమైన భాగవతాన్ని ఆంధ్రీకరించి, నా కంకితం చేయవలసింది. దాని వలన నీకు భవబంధ విమోచనం కలుగుతుం' దని ఆనతిచ్చి, తిరోహితు డయ్యాడు. పోతన ఆశ్చర్యచకితుడై యింటికి తిరిగి వచ్చి—

పలికెడిది భాగవత మఁట
పలికించు విభుండు రామభద్రుండఁట, నే
బలికిన భవహర మగు నఁట
పలికెద వేఱొండుగాథఁ బలుకఁగ నేలా?

'గవతము తెలిసి పలుకుట చిత్రంబు
లికెదఁ దక్కి చూలికైన
ంధజనులవలన విన్నంత కన్నంత
రియవచ్చినంత తేటపఱుతు.

—భాగ 1-16, 17.

ు నిర్ణయించుకొని రామాంకితంగా గవతాన్ని పండితపామరజనానురంజ గా ఆంధ్రీకరించి, ఆకల్పతరువు ంధ్రజాతి కభ్రరూపమైన కానుకగా మర్పించాడు.

స్మృతః కన్నడిగు డైనప్పటికీ, సం స్కృతాంధ్రభాషా సాహిత్యాల నభి గానించి, వాటి కెన లేని సేవ చేసి ఆ షలలో మహోత్కృష్టమైన గ్రంథా ను రచించిన కవితా ప్రావీణ్య ఫణీశుడు కృష్ణదేవరాయలు. (క్రీ. శ. 1509-530)

కుమారుడుగా క్రీ. శ. 1515 ప్రాం తంలో రాయలు కళింగ దేశాన్ని జయిం గాలనే కోరికతో బయలుదేరి, శ్రీకాకు ళంలో విడిసి చేశాడు. రాయలక్కడ కాదశినా డుపవాసంచేసి నిద్ర కుపక్ర మించాడు. ఆరాత్రినాలుగవ జామున ఆంధ్రమహావిష్ణు వతనికి కలలో ప్రత్య క్షమై 'నీవింతకుముందు మదాలస, సత్యా వధూ ప్రీణనాది సంస్కృత కృతులు ఇప్పుడివి అలభ్యంగావున్నా)రచించావు గదా! నీ కాంధ్రభాష అసాధ్యమా? తిరుపతి నివాసుడైన వేంకటేశ్వరస్వామి ంకితంగా ఒక ప్రబంధాన్ని వ్రాయి. నేను సంతోషిస్తాను. అతడికి, నాకు భేదం లేదుగదా! నీప్రబంధాని కితివృత్త మేమిటని ఆలోచించ నవసరం లేదు. మూడికుడుత్తనాంచార్-గోదాదేవి- అనే యువతి ప్రతిరోజూ తన తండ్రి అల్లిన పూలదండను ముందుగా తాను ధరించి, తర్వాత శ్రీరంగనాథుడనైన నాకు సమర్పిం స్తుండేది. నేనామెను వివాహమాడిన గాథను వ్రాయి. నీకు ఉత్తరోత్తరాభి వృద్ధి కలుగుతుం దని' సెలవిచ్చాడు.

ఆంధ్రభాష యసాధ్యంబె?
యందునొక్క
కృతి వినిర్మింపుమిఁక మాకుఁ
బ్రియముగాఁగ.
ఎన్నుమఁ గూర్తువన్న వినుము,
మేమును దాల్చినమాల్యమిచ్చున
కిన్నది రంగమందయిన
పెండిలిసెప్పుము, మున్నుగొంటి నే
వన్నవదండ రొక్కమగ
వాడిడ, నేను తెలుంగు రాయఁడన్
గన్నడరాయ! యక్కొడువఁ
గప్పు ప్రియాపరిభుక్తభోక్తృదన్.

-ఆముక్త 1-18, 14.

నిద్రనుండి మేల్కొన్నరాయ లా తెలుగు వల్లభుడి కంకితంగా, దేశభాష లలో లెస్సయిన తెలుగుభాషలో ఆముక్తమాల్యద అనే పేరుతో 7 ఆశ్వాసాల, 868 గద్యపద్యాల ప్రబంధాన్ని రచించాడు.

తంజావూరును పరిపాలించిన మహారాష్ట్ర మహీపతి ప్రతాపసింహుడు. (క్రీ శ. 1789-1752) అతని ఆస్థానాన్ని అలంకరించిన కవయిత్రి ముద్దుపళని. ఆమె సంగీత సాహిత్య భరత శాస్త్రాది విద్యలలో నిష్ణాత. తనయేలిక వలన చామీకరాంబరాభరణాలనుబహుమతిగా పొందిన అదృష్టవతి. రాధాకృష్ణుల శృంగారకేళీ విలాసాలను మృదుమధురంగా రసనిర్భరంగా వ్రాసిన కొద్దిమందిలో, పళని ఒకతె.

ఒకహరివాసరంనాడు ముద్దుపళని యే దైనా ఒకశృంగార ప్రబంధాన్ని నిబంధించాలని సంకల్పించి, శ్రీహరి ధ్యానం చేస్తూ నిద్రలోకి జారిపోయింది. ఆ నిశాంతంలో ఆమె కిష్టదైవమైన బాలకృష్ణు డామెకు కలలో కనబడి, కరుణామృతం చిలికేట్లుగా-

చిన్నికృష్ణుండ నే నాదుచిత్తమునకు
సమ్మతంబైన రాధికా సాంత్వనంబు
తగనొనర్పు మదీయాంకితముగ నీవు
లలిగుణ పేటి! శ్రీముద్దుపళని బోటి!

- రాధికా. అవ. 11

అని అనతిచ్చి,అంతర్ధానం చెందాడు. మఱునాడు ముద్దుపళని అభయవేదాంత ప్రతిష్ఠాపనాచార్యుడైన తన గురువు వీర రాఘవ దేశికసార్వభౌముడి వద్దకు వెళ్ళి, తన స్వప్నవృత్తాంతాన్ని వివరించింది. దేశికు డానందించాడు. అతని ప్రక్కనే వున్న విద్వద్వర్యులావిషయాన్ని విని 'శ్రీకృష్ణసందర్శనంవలన నీకధిక శ్రేయః ప్రాప్తికలుగుతుంది' అని సూచించారు ముద్దుపళని వారి సూచన ననుసరించి, ప్రబంధ నిబంధనోద్యుక్తురాలై, యింటికి వెళ్ళి, రాధికాసాంత్వన మనే శీర్షికతో 4ఆశ్వాసాల, 585 గద్యపద్యాల పరిమితి గల శృంగార ప్రబంధాన్ని రచించి, శృంగారరసస్వరూపుడైన శ్రీకృష్ణుని కంకితం చేసింది

క్రీశ. 17, 18 శతాబ్దులలో, సాహితీ కేంద్రంగా విలసిల్లిన మధురను పరిపాలించిన నాయకరాజులలో కట్టకడపటివాడైన విజయరంగచొక్కనాథ నాయకుడి (క్రీ. శ 1706-1782) అనుగ్రహానికి పాత్రుడైన కవి సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు.

ఒకానొక సమయంలో అతడికి సకల కలికలుష తిమిరభాస్కరోదయమూ, ఉల్లసిత సంపత్పల్లవవాసంతికావాసమూ, నవరసనిగూఢ గంభీరమైన ఒకమహాప్రబంధాన్ని వ్రాయాలనే సంకల్పం కలిగింది. ఒకనాటి ప్రభాతకాలంలో శ్రీదేవి భూదేవీ సమేతుడైన రంగనాథస్వామి అతడికి స్వప్నంలో దర్శనమిచ్చి-

వాసిన్ రంగవిభుండ నేను, ధరణిన్
వాక్ప్రౌఢిమన్ నీ వహా
ల్యాసంక్రందన మన్ ప్రబంధము, రసో
ల్లాసంబుగాఁ జేయఁగా
రాసంగోరి వినంగ వచ్చితి, ప్రియం
బౌనట్లు నా పేరిటన్
భావిల్లం దగ సంకితంబు నొనరూ
ర్పన్ నీకు మేలౌ నిఁకన్.

– అహల్యా. అవ. 15.

అని ఆనతిచ్చాడు. కృష్ణప్ప వెంటనే మేల్కొని కార్యకరణీయాలను తీర్చుకొని తన ఆప్తసఖులైన శేషము వేంకటపతిని, (ఇతడు శశాంకవిజయకర్త) బుణేగ కృష్ణకవిని తన వద్దకు పిలిపించుకొని, తన స్వప్నవృత్తాంతాన్ని వారికి తెలియ జెప్పాడు. వారు సంతోషిత చిత్తులై "నీకు కస్తూరిరంగనాథస్వామి శ్రీభూదేవీ సమేతంగా కనిపించాడు కనుక నీ కిష్టార్థికంగా ధన ధాన్య కరి తురగ భట కదంబక గ్రామ భూమ్యాది నానావిధసంపదలు లభిస్తాయి స్వామి సప్త సంతానాలలో శ్రేష్ఠతమమైన ప్రబంధాన్ని నిర్మించవలసిందిగా కోరారు కనుక నీకు గూడ సత్సంతానప్రాప్తికలుగుతుం' దని తెలియజెప్పారు.

కృష్ణప్ప ప్రమోదభరితాంతరంగుడై ఆ రంగనాథుడి కంకితంగా అహల్యాసంక్రందన మనే ప్రబంధాన్ని 3 ఆశ్వాసాలు, 404 గద్యపద్యాలలో రచించాడు.

వైష్ణవమత ప్రచారకులైన పన్నిద్దరాళ్వారులలో ఒకడైన తొండరడిప్పొడి ఆళ్వారు (విప్రనారాయణుడు) చరిత్రను వైజయంతీవిలాస మనే పేరుతో రసవత్తరంగా వ్రాసిన కవితల్లజుడు సారంగు తమ్మయ. తమ్మయ గోలకొండనవాబు మహమ్మదుషాహీ (క్రీ. శ. 1581-'61) కాలంలో కరణంగా వ్యవహరిస్తుండేవాడు.

ఒకనాటిరాత్రి తమ్మయ నిద్రిస్తుండగా రఘుకులాన్వయరత్నదీపమై శ్రీరామచంద్రు డతనికి ప్రత్యక్షమై–

.. ... నా పేర నీవు సేయు
కావ్య మంకిత మొనరింపు భవ్యసరణి.

– వైజయంతి, అవ. 82.

అని ఆనతిచ్చాడు. వెంటనే తమ్మయనిద్రనుండి మేల్కొని 'అతి మధురమధురసాస్వాదనం వలన వెగటు కలిగినవాడు కట్వామ్లాదికాల రుచిని కోరినట్లుగా శ్రీరామచంద్రుడు వాల్మీక్యాదికవికోకిలల వాగమృతాన్ని గ్రోలి, ఇప్పుడు నా పురాకృతసుకృతం వలన నామాటలను వినటాని కుత్సహిస్తున్నాఁ డని సంతోషించి, 4 ఆశ్వాసాల 579 గద్యపద్యాల వైజయంతీ విలాసమనే ప్రబంధాన్ని రచించి, శ్రీరాముడి కంకితం చేశాడు.

క్రీ శ. 18 వ శతాబ్దంలో వెలసిన రసవత్ప్రబంధాలలో కనపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధచరిత్ర మొకటి. అబ్బయ అద్భుత కవితా శ్రీమంతుడు, గానకళాధీమంతుడు. తెలుగు పలుకుబడులలోని పసందు, వైచిత్రి అతని కవితకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు.

'ఒకనాటి రాత్రి అబ్బయ తన యిష్టదైవమైన మంగళగిరి నరసింహస్వామి కోవెలకు వెళ్ళి, ప్రదక్షిణంచేసి, గర్భాలయంలోకి వెళ్ళి, స్వామివారికి నమస్కరించాడు. స్వామి అబ్బయకు ప్రత్యక్షమై, అతడి నుద్దేశించి 'నీకు బాల్యంలోనే అద్భుతకవితా శక్తిని ప్రసాదించాను. ఇప్పు డనిరుద్ధచరిత్ర మనే ప్రబంధాన్ని నాకంకితంగా వ్రాయి. నీకు శ్రేయోవర్ధన మౌతుం" దన్నారు

అనిరుద్ధచరిత్రమఁ జ
క్కనిమచ్చటవిస్తరించి కణఁగి ప్రబంధం
బొనరింపుము శ్రేయోభి
ర్ధన మగు నా పేర నంకితము సేయు
తగన్.' – అనిరుద్ధ, అవ. 24.

విశేష మేమిటంటే, ఈ సంఘటన భౌతికంగా జరిగింది కాదు. అబ్బయ కన్న కల.

అబ్బయనిద్రనుండి మేల్కొన్నాడు. తన కంతటి శుభప్రదమైన కలవచ్చినందుకు సంతోషించాడు 5 ఆశ్వాసాల, 620 గద్యపద్యాల పరిమితిగా అనిరుద్ధచరిత్రమనే ప్రబంధాన్ని రచించి, ఆ నరహరి కంకితం చేశాడు.

ఆంధ్రసాహితీ వృక్షం కాసిన మధుర ఫలాలలో కూచిమంచి తిమ్మకవి ప్రణీతమైన నీలాసుందరీపరిణయ మొకటి. (క్రీ. శ 17 శ. పూర్వార్ధం)

తిమ్మకవికి అచ్చతెనుగుకావ్య మొకటి వ్రాద్దామనే సంకల్పం కలిగింది. ఒకరోజు రాత్రి అతడు నిద్రిస్తుండగా పరమశివుడు కలలో దర్శన మిచ్చి–

మును కబ్బంబుల నెల్లఁ జెప్పి యొకమిం
చొల్పొందుచున్ నాకు న
ప్పనముల్జేసిన ప్రోడవీ విభుడుగా
ర్పంబూను నీయచ్చతెం
దెనుఁగుంగబ్బము నిమ్ము నిచ్చలపు బ
త్తిన్ ముత్తియాన్ బుత్తియున్
నెనరొప్పన్ సమకూర్చు చెప్పుడును నే
నీ యొద్దనే యుండెదన్. – నీలా.

పీఠిక. 18

అని అంతర్ధాన మయ్యాడు. తిమ్మన నిద్రనుండి మేల్కొన్నాడు. ఆ తర్వాత శివాంకితంగా నీలాసుందరిపరిణయ మనే కావ్యాన్ని 8 ఆశ్వాసాల, 859 గద్యపద్యాల పరిమితిగా వ్రాశాడు.

శ్రీకృష్ణసంబంధియైన కథను పరమేశ్వరుని కంకితం చేసిన అభేదభక్తితత్పరుడు తిమ్మకవి.

తన నాటివరకు సంస్కృతాంధ్ర భాషలలో వెలసిన గ్రంథాలను, చాటుపద్యాలను సేకరించి, వాటిని సాగరమథనం' గా చదివి, జీర్ణించుకొని, అవసరమైన పద్యాల నుదాహరిస్తూ అప్పకవీయ మనే గొప్పలక్షణ గ్రంథాన్ని రచియించిన మేధావి కాకునూరి అప్పకవి.

శాలివాహన శకం 1578 సం. మన్మథ నామసంవత్సర శ్రావణ బహుళ అష్టమి (క్రీ. శ. 8-౯-1656) నాటిరాత్రి అప్ప శ్రీకృష్ణార్చనలు జరిపి, పురాణగోష్ఠి సలిపి శ్రీహరిధ్యానం చేస్తూ నిద్రిస్తుండగా విష్ణుమూర్తి రమాధరణీదేవీ సమేతంగా స్వప్నంలో సాక్షాత్కరించి, నన్నయ భట్టారక కృతమైన ఆంధ్రశబ్దచింతామణి నాంధ్రీకరించవలసిందిగాను, దానికి తనను కృతిపతిని చేయవలసిందిగాను అనతిచ్చాడు.

ఆయువతుల్ రమాధరణు
లేను బయోరుహపత్రనేత్రుఁడన్
ఇయ్యెడఁ గూర్మిఁ గల్గిధర
జీవితోత్తమ! వచ్చినాఁడ శ్వ
స్త్యయసమబ్బు నీకునిక
నిద్దము నన్నయ పక్కి యంధ్రమం
జేయుము మాయనుగ్రహము
చేఁగవు అచ్చెరువంది మెచ్చఁగన్

అప్ప. పీఠిక. 40

మటుంపాడప్పకవి తన బంధుమిత్రాదులను రావించి, తన గన్నకలను వివరించాడు. వారందరు సంతోషించి, స్వప్నంలో కనిపించిన విష్ణుమూర్తివలన మోక్షమూ, లక్ష్మీదేవివలన ధనసమృద్ధి, భూదేవివలన భూలాభమూ, శంఖచక్రాలవలన విజయమూ లభిస్తాయని తెలిపారు.

అది విన్న అప్పకవి సంతోషించి, గామేపల్లిలో వెలసివున్న గోపాలదేవుని అంకితంగా అప్పకవీయ మనే లక్షణగ్రంథాన్ని వ్రాశారు.

మొట్టమొదట అతడీ లక్షణగ్రంథాన్ని ఎనిమిది ఆశ్వాసాలుగా వ్రాద్దామనే సంకల్పించాడు. కాని, ప్రస్తుతం మనకు ౫ ఆశ్వాసాల గ్రంథంమాత్రమే లభిస్తున్నది.

కావ్య సృష్టి అనేది ఒక తపస్సు వంటిది. కావ్య రచనచేసే ప్రతికవి ప్రత్యేక వ్యవస్థలో తమ కృతి స్వరూపాన్ని గురించి ఏకాగ్రచిత్తంతో ధ్యానిస్తారు. బహుధా ఆలోచిస్తారు. వారి హృదయాలనిండా ఆ కావ్యేతి వృత్తాలే నిండివుంటాయి. వారు జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది సర్వావస్థలలోనూ వాటిని గురించి మననం చేసుకొంటూఉంటారు అటువంటి అంతర్మథన పరిస్థితులలో వారివారి ఇలువేల్పులు, ఇష్టదేవతలు, లేదా వారి వంశపూర్వీకులు వారికి స్వప్నాలలో సాక్షాత్కరించి. ఒక మార్గాన్ని నిర్దేశిస్తారు. వారా నిర్దేశాలను వేదవాక్యాల్లాగ శిరసా వహించి, కావ్యరచన కుపక్రమించి సిద్ధసంకల్పులౌతారు. ఇంతవరకు మనం చూచిన సంఘటనలన్నీ ఈ కోవకు చెందినవే!

ఈవిధంగా మన ఆంధ్రకవులు కొందరు ప్రార్థితస్వప్నరీతిలో ప్రేరణ నొంది, రసవత్తరమైన ప్రబంధాలను సంతరించారు. వాటిని భగవదంకితం చేసి తరించారు.

.........

# ఒకవిశిష్టప్రబంధం - ధీరజన మనో విరాజితం

— శ్రీ కపిలవాయి లింగమూర్తి

దీనికర్త తెనాలి రామలింగడు. ఇతడు విశ్వబ్రాహ్మణుడు. ఈకవినిగురించి 'కుతుబ్ షాహీ సుల్తానులు - ఆంధ్రసంస్కృతి' అనే సంకలనంలో 'ఆంధ్రదేశపు సంస్థానాధీశ్వరు' లనే వ్యాసంలో నిడదవోలు శ్రీశివసుందరేశ్వరరావుగారు, ఘటికాచల మాహాత్మ్య పీఠికలో శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారు పేర్కొన్నారు.

ఆంధ్రదేశంలోని చాతుర్వర్ణ్యంలో ఇంటిపేరు, వ్యక్తిపేరు ఒక్కటిగానే ఉండి వారు వీరుగా వీరువారుగా తరుచు పొరబడటం జరుగుతుంది. కాబట్టి ఈయిద్దరివివరాలు పరిశీలించండి. కాలంచేత మొదటివాడైనవాడు బ్రాహ్మణుడు, తరువాతివాడు విశ్వబ్రాహ్మణుడు.

మొదటిరామలింగని యింటిపేరు గార్లపాటివారు. తెనాలి అగ్రహారీకులు కావటంచేత తెనాలివారైనారు. అతనితండ్రి పేరు రామధీమణి. తల్లి లక్ష్మమ్మగారు. గురువుపేరు భట్టర చిక్కాచార్యుడు. వీరు కౌండిన్య సగోత్రులు యజుర్వేదులు.

రెండవవాని యింటిపేరు తెనాలివారు. ఇది ప్రస్థానాన్నిబట్టి ఏర్పడి ఉంటుంది. ఇతడెక్కడివాడో తెలియదు కాని త్రిపురాంతకం ప్రాంతంవాడు కావచ్చు ననుకుంటున్నాను. వీరు శైవులు. తండ్రిపేరు మల్లికార్జునుడు. తాతగారిపేరు మృత్యుంజయుడు.

ప్రస్తుతం తెనాలివారిలో కశ్యప - పరాశ్చితసు లని రెండు గోత్రాలవారున్నారు. కాశ్యపులు ఋగ్వేదులు. పరాశ్చితసులు కృష్ణవేదులు. వీరిలో మన రామలింగ డే గోత్రానికి చెందువాడో తెలిసిరాలేదు.

పై యిద్దరికీ పేరులోతప్ప ప్రతిభాపాండిత్యాల విషయంలో ఏ సామ్యం లేదు. మొదటివాడైన రామకృష్ణుడు ఒక చాటువుతో కవి 'నేను రామకృష్ణుడ - కవి యను శబ్దమ్ము నీటికాకికి లేదే! 'అన్నాడు. అది ఇతనిపట్ల అన్వయిస్తుంది.

ఇతని కృతియైన ధీరజన మనోవిరాజితం ఏకాశ్వాస పరిమితమైన ప్రబంధం. దానిలో 180 గద్యపద్యా లున్నవి. కవిత్వాన్నిబట్టి ఇది మనోరంజనంకాదు. కాని విషయాన్నిబట్టి మాత్రం విడువదగింది కాదు.

కవిత చచ్చుదైన కథ పేరు గలదైన కవికి కొంతకీర్తి గలుగవచ్చు. (గబ్బిలం. భా. 2) అని జాషువాగారన్నారు కాబట్టి అవిధంగా నిలచిన

వానిలో ఇది ఒకటి సహారీ విశ్వేశ్వర సంవాదం, శ్రీగురుబ్రహ్మేంద్రస్వాముల వారి వీర బ్రహ్మాండ సర్వశాస్త్ర సమాధానాలు కూడ ఈకోవకే చెందుతవి. ఇవి కవితా ప్రధానమైనవి గావు.

మధ్యయుగంలో మహమ్మదీయుల దురాక్రమణ కారణంగా దేశంలో గురుకులాలు ఘటికాస్థానాలు నడువక పండితులు కొరవడి కవిత్వం సహజాతంకాబట్టి కవులు మాత్రమే మిగిలినారు. వారికిగూడ తమ కవిత్వానికి వన్నె పెట్టుకునే అంత పాండిత్యమైనా అలవరుచుకునేందుకు ప్రశాంతి లేకుండేంది. రెండవవైపు పరమతాల బారిపడకుండా స్వమతాన్ని రక్షించు కోవలసిన బాధ్యత ఒకటి ఉన్నది. అందుచేత ఆకవులు తమకు పరిమితమైన భావలోనే జాతిని ప్రబోధించే రచనలు చేయవలసి వచ్చింది. యక్షగానాలు - ద్విపదలు చేపట్టినారు. ప్రకృతమైన ధీర జనమనోవిరాజితం అటువంటి కాలంలోనే పుట్టింది. కాబట్టి కవిగారు దీన్ని మహాప్రబంధ మని చెప్పుతున్నా భాషావిషయంలో వాక్యనిర్మాణ విషయంలో దీనిలో యక్షగాన లక్షణాలే ఎక్కువగా చోటుచేసికొన్నవి.

దీనిలో విశ్వబ్రాహ్మణులకు అమరుని వలన, గోపరాజు రామ ప్రధాని వలన, జరిగిన రెండన్యాయాలు చెప్పబడినవి.

విశ్వబ్రాహ్మణుల కన్యాయంతల పెట్టిన వారిలో మొదటివాడు వ్యాసుడు. అతడు సోరిస్ పరిమళచోళుని కాలంవాడు. ఇతడు క్రీ. శ. 600 ప్రాంతంలోమందోటి పట్టణాన్ని పాలించినాడు. దానికి మాందా - మాంధాత పట్టణా లనికూడ పేరు. ఇది ఈనాడు కొలంబోనుండి జాఫ్నాకు వెళ్ళేమార్గంలో 18 కిలోమీటర్ల దూరంలో ఉన్నశిథిలా అని సిలోన్ గజెట్ లో ఉందట. కాబట్టి ఇది సింహళ ద్వీపానికి సంబంధించిన కథ.

వ్యాసుడు తనసంచారంలో కాశినుండి అక్కడికి వెళ్ళి పరిమళుని దర్శించి ఆస్థానంలో తనకొక ఆచార్య పీఠం కల్పిస్తే వారికీర్తిని పురాణాలలో అగ్గిస్తా నని కోరినాడు కాని అంతవర కక్కడ రాజ గురువులుగా మయాచార్యు లుండటంచేత పరిమళుడు నిరాకరించెను.

అతనికి పట్టమహిషియందు సంతానం లేదు. భోగపత్నికి కళింగుడు అనేకుమారు డున్నాడు - చరిత్రలో పూర్వచంద్రగుప్తుడు - శ్రీకృష్ణదేవరాయలు భోగపత్నుల సంతాన మనియే ప్రసిద్ధి - మహావృద్ధుడై కుమారునికి రాజ్యం అప్పగించడానికి రాజగురువుతో ఆలోచించగా ఆయన రాజ్యానికి కళింగుడు అర్హుడుగాండని, దాన్ని అతని సోదరునికి అప్పగించమని చెప్పినాడు గుర్వాజ్ఞ ప్రకారం పరిమళుడు రాజ్యాన్ని సోదరుడైనపణ్బులి చోళునికి అప్పగించి విశ్రాంతితీసుకుని ఆ చిరకాలంలోనే కన్నుమూసినాడు. అతడుగతించడంవ్యాసునికికలిసివచ్చింది. కళింగునిచేరి మీ తండ్రి రాజ్యానికి నీవు గాని మీపినతండ్రి వారసుడెట్లా అవుతాడు? అందుచేత అతనిని వధించి నీవు సింహాసనం ఆక్రమించుకో!" అని బోధించినాడు. అది విని కళింగుడు సమయం కొఱకు వేచి ఉండి పణ్బులి చోళుడు వేటకు వెళ్ళటం చూచి, అక్కడ అతనిని వధించి పులివాత పడినట్లు చిత్రించి తాను గద్దెనెక్కినాడు.

కళింగుడు గద్దెనెక్కటంతో వ్యాసునికి రాజాస్థానంలో పదవి లభించింది రాజకీయంలో పురుషులు సుముఖంగాలేని పనులు స్త్రీలతో కారవేయుతూ ఉంటవి. ఈరహస్యం వ్యాసునికి తెలుసు కళింగుని భార్య వసుంధరాదేవి. అతడామె విలాసానికి వశుడు. అందుచేత వ్యాసుడామెను చేరి వలిచే ఏవిధంగానైనా రాజాచార్య పదవి దనకిప్పించవలసినదిగా ప్రాధేయపడినాడు. అంత మహారాజు రాణిమాట త్రోసివేయలేక ఒకసందర్భంలోసభలో వ్యాసునికి రాజగురువుగారికి ఒకపరీక్ష కల్పించి గురువుగా రోడినట్లు చిత్రించి ఆగద్దెపై వ్యాసుని ఎక్కించినాడు.

అతడు పీఠమెక్కగానే రాజుగారికి ఎడమవైపున మయాచార్యునికి మరో పీఠం పెట్టించి ప్రపథమంగా కుడి యెడమ భేదాలు జాతులలో కల్పించి విశ్వకర్మలను ఎడమవారినిగా చేసినాడు. దానితో వా రది అంగీకరించలేదు తమ పక్షం చేరని వారికి పనులు మానినారు. దేశంలో అలజడి రేగింది

వ్యాసుడు పౌరసభలు చేస్తూ విశ్వకర్మలు బ్రాహ్మణులుకా రని వారు తమ పీఠానికి లొంగివుండి రాజాస్థానంలోను దేశంలోను తమ వృత్తులు సాగిస్తూ ఉండవలసినదే అని చెప్పసాగినాడు. అపు డది సహించక ఒకయువకు డుపన్యాసంలో ఎత్తిన వ్యాసుని చేతిని నరికివేసినాడు.

దేశంలోని ఈ విప్లవాన్ని చూచి పౌరుగురాజు - ఉపకంఠదేశాధిపతి - జయవీరుడు కళింగునిపై దండెత్తి వధించి పణ్బులి చోళుని కుమారుడు కాలకచోళుని పట్టాభిషేకించి మయాచార్యుని యథాపూర్వంగా రాజగురువును చేసి తన రాజ్యానికి వెళ్ళిపోయినాడు. ఈసందర్భంలో అతడు వ్యాసునిగూడ వధింప చూచినాడు కాని అతడు తన మొండిచేతితో శాస్త్రాలన్నీ కట్టుకొని కాశీకి పారిపోయినాడు ఇది ధీరజనమనో విరాజితానికి మొదట జరిగిన కథ

నేడు విశ్వబ్రాహ్మణులకు ఈవ్యాసుడు కృష్ణద్వైపాయను డనియే నమ్మకం. కాని శ్రీకోట వెంకటాచలంగారి భారతీయ శకకమలు అనే గ్రంథంలో జనమేజయుని పట్టాభిషేక కాలం క్రీ. పూ. 2342 అని చెప్పబడింది. అతని సర్పసత్రంనాటికి వ్యాసుడు వృద్ధుడై భారత ప్రవచనం చేయలేక వైశంపాయనుని

మహారాజు యాత్రలకు పోగానే కర్పకునికి అమరుడు మంత్రి అయినాడు. ఆ సందర్భంలో పట్టణంలోని ధనవంతులు అతనికి తోచిన కానుకలు సమర్పించుకున్నారు. అతడు విశ్వకర్మలను రెండు వీసెలబంగారం బహుమానంగా అడిగినాడు. వారు నిరాకరించినారు.

ఫణీంద్రపట్టణంలో ఏటా పట్టాభిషేకోత్సవాలు జరిగేవి. ఒకప్పటి ఆ ఉత్సవానికి కర్పకుడు విశ్వకర్మలను తనకు బంగారు కిరీటం చేసి ఈయవలసింది అని ఆజ్ఞాపించినాడు. వారది ఉత్సవం నాటికి శిల్ప శోభితంగా చేసియిచ్చినారు. అది చూచి అమరునికి మంత్రియైన తనను తిరస్కరించి మహారాజును మన్నించి నందుకు కన్నుకుట్టింది. దానితో అతడు కర్పకునికి అతని జన్మ రహస్యం చెప్పి కిరీటంయొక్క శిల్పానికి తట్టి, వారు గడ్డపారల వరంగా సంకేతాలు చెప్పి దుర్వ్యాఖ్యానం చేసి నగరంలోని విశ్వకర్మలు నీ జాతిని తెల్పటానికే ఈపని చేసినారని చెప్పి మీతండ్రిగారు వచ్చేసరికి ఇక్కడి స్వర్ణకారుల నందరిని వధించు అని చెప్పినాడు.

అది విని కర్పకుడు క్రోధోద్రిక్తుడై అమాయికులైన స్వర్ణకారులపై విరుచుకు పడినాడు. ఎందరో నిరపరాధులు బలియైనారు. మరికొందరా పట్టణం విడిచిపారిపోయినారు. మిథిలాసాలలోని ఆంధ్ర పూర్ణాచార్యులకుటుంబం ఈ కర్పకుని ధాటికే అక్కడికి వెళ్ళినట్టుగా అతని చరిత్రలో చెప్పబడింది.

కర్పకునియొక్క ఈ దురాగతానికి విశ్వకర్మ అప్పుడిక్కడినుండి పారిపోయి మందోటి దగ్గర మరొక ద్వీపంలో అయస్కాంత శిలలు సృజించి కోట గట్టుకొని నివసించి అక్కడినుండి మళ్ళీతమవృత్తులు సాగించు కోసాగినారు. పెట్టె తెగలను సృజించి వారు తమ వస్తువులను వారిచే వివిధ ప్రాంతాలకు పంపి అమ్మించేవారు. కాంస్యకారుడైన ధర్మపాలుని ఉదంతం వారక్కడ ఉండగానే జరిగింది. ఆంధ్ర పూర్ణుల చరిత్ర - ధర్మపాల విజయం ప్రత్యేక ప్రబంధాలుగా ఉన్నవి.

పట్టణం విడిచి పోయినా అమరుడు వీరిపై కక్ష మానలేదు. కర్పకుని వారిపై దండయాత్రకు పురికొల్పినాడు. ఆ కోట అయస్కాంత శిలలది కాబట్టి సైన్యంతో సమీపానికి వెళ్ళేసరికి వారి ఆయుధాలన్నీ అది లాగుకునేది. దాని మెట్లు సూర్యకాంత చంద్రకాంత శిలలు ఒకదాని విమ్మట ఒకటి పేర్చికట్టబడి ఉండేవి. కోటలోనివారు పగలు చంద్రకాంత శిలలపైనుండి రాత్రులు సూర్యకాంత శిలలపైనుండి నడిచేవారు. ఈ రహస్యం తెలియనివారెవరైనా వానిలోనికి పోవటానికి యత్నిస్తే పగలైతే సూర్యకాంత శిలపై వారికాళ్ళు పడగానే శరీరమంతా తాపంతో మాడిపోయేది, రాత్రి అయితే చంద్రకాంత శిలపై కాలుపెడినప్పుడు ఒడలు శీతానికి గడ్డకట్టుకు పోయేది.

అమరునికి దాన్ని ఏవిధంగాను సాధించటం వీలు కాలేదు. చివరకు దానిలోని యువకులపై ఒక వేశ్యను ప్రయోగించినాడు. ఆమె కోటలోనికి వెళ్ళటానికి ప్రయత్నించక దానిదాపున ఒక కుటీరం నిర్మించుకుని వారి నాకర్షించే ప్రయత్నం చేసింది. చివరకు ఒక యువకుడామెకు వశుడైనాడు. ఒకనాడామె అతడు తన కౌగిలిలో ఆదమరచి నిద్రించి ఉండగా ఓ విశ్వకేశా! మీకోట కాలిపోతుంది లేలే! అని కలవరపరిచింది. దానితో అతడు ఆరికకసు వెవరు తెచ్చినారుఅంటూ కలవరంతో లేచినాడు.

ఇంకేం ఆమెకు రహస్యం తెలిసిపోయింది. కలవరపడిన అతనిని ఏమీ లేదు. నాకు కలవచ్చింది.అంతే కలవరించి నట్లున్నాను. అని అతనిని సమాధాన పరిచింది. అయితే ఆయువకుడంత అజాగ్రత్తపరుడుగాడు తమరహస్యం బొక్కిపోయిందని తెలిసి అప్పుడే కోటకువెళ్ళి తమ పెద్దల ముందు చేసినతప్పు చెప్పి దోషిగా లొంగిపోయినాడు.

అది విని వారు అంతా దైవలీల అనుకొని ఆరాత్రికి రాత్రే తగు జాగ్రతలతో కోటనుండి తమ శాస్త్రాలు, పరికరాలు, తీసికొని తరలిపోయినారు.

ఈలోపల వేశ్య వెళ్ళి ఆ అమరునితో కోటరహస్యం చెప్పింది. అది విని అతడు తెల్లవారేసరకు ఆరికకసువు తెప్పించి దాని చుట్టు వేయించి తగుల బెట్టించినాడు. దానితో ఆ శిలలు తమశక్తినికోల్పోయి కోట వశమయ్యింది. నాటినుండి అమరుడందుకు ప్రతిఫలంగా వేశ్యలకు ఆలయాలలో దేవదాసీపదవి ఏర్పరచి గౌరవించినాడు.

ఇక్కడ ఇదంతా జరిగేనాటికి అక్కడ మహారాజు యాత్ర పూర్తిఅయింది.విశ్వకర్మ అతనిని శిలానదివద్దకు కొనిపోయినారు. ఆనదినీరు దేనికి సోకినా అది శిలాభూతం అవుతుందట. కాబట్టి పురాణయాత్రలన్నీ ఇంతటితో ముగుస్తవి.

మేరువు బంగారుకొండ. శిలానది తీరంలో విశ్వకర్మలు కాలివి ప్రార్థించి మహారాజును దాని దర్శనం చేయించినారు.

పూర్వం కైలాసంలో ఒకప్పుడు శివ పార్వతులకు ఎవరుఅందమైనవార మనే మీమాంస వచ్చింది. ఋషులందరినీ పిలిచి అడిగితే ఎటూ చెప్పలేక వారు విశ్వకర్మ నడుగు డని చెప్పినారు. అప్పుడాయన వచ్చి వారిజగీమ పెరిగి దర్పణాన్ని సృజించి వారిముందు నిలిపి ఇక మీరే తేల్చుకోండి అని చెప్పినాడు. అప్పుడా సృష్టికి శివుడద్భుతపడి ఏంకావలెనో కోరుకో అన్నాడు. అందుకు విశ్వ కర్మ

మళ్ళీగద్దె నెక్కిన తరువాత విశ్వకర్మలను పిలిచి ఏం కావలె నని అడిగినాడు. వారు అమరుని పట్టి ఇమ్మని కోరినారు. అతడు వానిని కాశాలతో కట్టించి విశ్వకర్మల కప్పగించినాడు. వారతనిని గ్రామబహిః ప్రదేశానికి కొనిపోయి ఒక కంబానికి కట్టి వేసి చిత్రవధ చేసినారు. ఇతడు నామ లింగాను శాసనకర్త అని విశ్వకర్మల నమ్మకం.

ఆతర్వాత స్నానంచేసి శుచులై కాళికాలయానికి వెళ్ళి ఆదేవిని ప్రార్థించి కర్పురుని బారికి పెంచి చల్లా పెద్దదైన తమ జాతి నుద్ధరించుమని కోరగా ఆమె నేను వీరపాపాంబగా అవతరించి మీ వంశాల నుద్ధరిస్తా నని చెప్పింది.

ఇంతటితో ఈ కావ్యంలోని మొదటి కథ ముగిసింది. దీనితో ఒక శిలాపది వృత్తాంతం, మేరు దర్శనం తప్పితే తక్కిన విషయంలో అసంభావ్యత ఏదికనపించదు.

కాళిదాసు జ్యోతిర్విదాభరణంలో - ధన్వంతరి క్షపణ కామరసింహ శంకు వేతాళభట్ట ఘటకర్పర కాళిదాస వరాహమిహిరులు విక్రమార్కుని ఆస్థానంలోని నవరత్నా లని చెప్పినాడు. ఈ విక్రమార్కుని క్రీ. పూ. 57 నాటివాడని చారిత్రకు లంగీకరించినారు. ఇక అమరసింహుని శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృత వాఙ్మయ చరిత్రలో క్రీ. శ. నాలుగవ శతాబ్ది వానినిగా నిర్ణయించినారు. అందుచేత పరిమళ చోళుడు క్రీ. పూ. 6 శతాబ్దివాడు కాబట్టి ఈ అమరుడు ఏవిధంగా చూచినా ఆకాలానికి చెందడు. అందుచేత వ్యాసుని వలె ఇతడుకూడ ఆపేరు గల మరొకడు కావలెను.

నామలింగానుశాసనకర్త అమరసింహుడు. ఇతడు కేవలం అమరుడు. అతడు జైనుడు. వీనికి కులభేదంగాని ధనాశగాని ఉండవు. ఇతడు కులం పట్టింపు ధనాశ రెండూ కలవాడుగా కనిపిస్తాడు. ఇక వీరినడుమ గుణపాఠం నేర్వకున్న తప్పు మళ్ళీ చేయటం మానవ లక్షణంగాదు కాబట్టి విశ్వకర్మను దూషించి తత్పరిణామంగా మూల స్తంభరచన చేసిన అమరుడెవడో! ఇంకాఇట్టి అమరుల నెందరిని సృష్టించినారో ఆ అమరులకే ఎరుక.

ఇతని కథను పరిమళచోళ చరిత్ర పేర యక్షగానంగా మాటకోడూరు గోళయాచారిగారు, యక్షగానంగా మరొకరు చిత్రవధ పేర వచనంగా రచించినారు.,

ఇక ధీరజన మనోవిరజితంలోని రెండవ కథ గోపరాజు రామనగారిది. మొదటికథలో కొంత పురాణ ఛాయ ఉంది. ఇది అచ్చమైన చరిత్రాధారాలు గలది. ఈ రెండిటినడుమ కాలవిలంబం కూడ చాలఉంది.

అమరునికథ పూర్వం ఎప్పుడో జరిగితే ఇది క్రీ. శ. 11 వ శతాబ్దిలో జరిగింది. విశ్వకర్మ సాహిత్య ప్రకారం ప్రాచీన చోళులంతా విశ్వకర్మ భక్తులుగా కనిపిస్తారు. వారి ఆస్థానాలలో మనుమయాచార్యులే రాజగురువులుగా ఉన్నారు. కాబట్టి వారికి సంబంధించినకథలన్నీ వారి కాలంలోనే గడిచినవి. కరికాలుడు క్రీ.శ. రెండవశతాబ్దంలో ఉన్నట్లు "శిలప్పదికారం" అనే తమిళకావ్యాన్ని బట్టి తెలుస్తుంది. ఆకథ నడిచిననాటినుంచి రాజాస్థానాలలో వీరు ఆచార్యులుగా ఉన్నారు. ఆ తరువాత పాండ్యదేశంలో జరిగిన దుర్ఘటన పిమ్మట వీరి పీఠాలు నామరహితమైనవి. ఇది ఎట్లా ఉన్నా ఆ ప్రాచీన చిహ్నంగా నేడు కరికాలుని మూలపురుషునిగా చెప్పుకొనే (ఏరువ) చోళుల శాసనాలలో మాత్రంవిశ్వకర్మల పురాణమైన మూల స్తంభంలోని "నమస్తుంగశిరశ్చుంబి చంద్ర చామర చారవే, త్రైలోక్య నగరారంభమూల స్తంభాయ శంభవే." అనే మంగళశ్లోకం ప్రారంభ శ్లోకంగా నిలిచింది.

గోపరాజురామన క్రీ. శ. 1144 నాటి వాడు. ఆయన ఒకప్పుడు తిరుపతియాత్ర చేసి తిరుగు ప్రయాణంలో సత్తెనపల్లి తాలూకాలోని మాదల గ్రామంలో ఒక బ్రాహ్మణుని యింట విడిసినాడు. అప్పటి వరకు గ్రామకరిణీకా లన్నీ విశ్వబ్రాహ్మణులకే ఉన్నవి. ఆనాడు ఆ బ్రాహ్మణుని యింటిలో తంత్రిగారి అద్దికం ఉన్నది. కాని అతడు సర్కారుకిమ్ము చెల్లించటానికి జాప్యం చేస్తున్నాడేమో! కరణం గారు అద్దికం అనిరైనా చూడక అతనికి బొండగొయ్య వేయించి నాడట. రామన అదిచూచినాడు.

అయేడు అనగా క్రీ. శ. 1144 రక్తాక్షి పిత్రు అమావాస్యనాడు సూర్యగ్రహణం కలుగగా గణపతి మహారాజు కృష్ణానదికి రాగా అక్కడికి వైదికులెవ్వరూ రాకుండా కట్టడి చేసి తానే సంకల్పం చెప్పి స్నానంచేయించి దానంగా మహారాజు గారిచే ఏడుగడియలు రాజముద్రిక పొంది అంతవరకు తాను సిద్ధం చేసి ఉంచిన కరిణీకం ధర్మాసాలపై దాన్ని ముద్రించి సమయంఅయిపోగానే ముద్రికమళ్ళీ రాజా గారి వశం చేసి పత్రాలు తనవారికి పంచినాడు.

ఈ రామనగారు యాజ్ఞవల్క్యుడు. అందుచేత మొదట తనవారికి అనియోగు కాలు పంచి వారు వదలిన తర్వాత తక్కినవారికి పంచినాడు. దానిలో అనాటినుండి నియోగులలోయాజ్ఞవల్క్యులు ప్రథమశాఖవారు తక్కినవారు ఆరువేలవారు అయినారు.

గోపరాజు రామనగారు చేసిన ఈ పనితో ఒక్కనాటిలో విశ్వబ్రాహ్మణుల కరిణీకాలన్నీ పోయినవి. ఈతబాయిలో ఒక్క మాసాబత్తులవారు మాత్రం ఎలాగో మిగిలిపోయినారు. ఈ విషయం విశ్వబ్రాహ్మణ కరిణీకాల చరిత్రలో

# బాపిరాజు కథలు - సంభాషణా చాతుర్యం

- డాక్టర్ వి సిమ్మన్న.

కథలోని ముఖ్యాంగాల్లో సంభాషణ ఒకటి. కథకుడు తన కథలోని పాత్రల వివిధ గుణశీల స్వరూప స్వభావాల్ని ఈ సంభాషణ ద్వారా వ్యక్తంచేస్తాడు. కథాగమనం కోసం, పాత్రల చిత్రీకరణ కోసం కథకుడు తనకు అనువైన చోట సంభాషణల్ని వినియోగించుకుంటాడు. వాస్తవిక జీవితంలోని సంభాషణల మాదిరిగానే కథలో కూడా తీర్చిదిద్దడానికి కథకుడు శాయశక్తుల ప్రయత్నిం చేసి తన సంభాషణాచాతుర్యాన్ని చూపుతాడు.

కథలో ఈ రకమైన సంభాషణలే ఉండాలని నియమ నిబంధనలు ఏమీ లేవు. ఈ సంభాషణలు విషయ, సంఘటన, సన్నివేశ, ఇతివృత్త, హాస్య, చమత్కార, ప్రధానంగా ఉండవచ్చు, కాని వాస్తవిక జీవితానికి దగ్గరగా వుండాలి.

చెప్పబడింది. దానిని శ్రీకోడాలి లక్ష్మీ నారాయణగారు రచించినారు.

ధరణమనోవిరాజితంలో ఈ వృత్తాంతం శ్రీకృష్ణదేవరాయల కాలంలో జరిగినట్లు చెప్పబడింది. కాని క్రీ. శ. 1149 వరకు కాకతి రెండవ ప్రోలరాజే ఉన్నాడు. కాబట్టి ఈ గణపతి మహారాజు గణపతి వంశీయుడని శ్రీలక్ష్మీనారాయణగారు నిర్ణయించినారు. ఈ కథలో ధరణమనోవిరాజితం ముగుస్తుంది.

ఇది కవితా దృష్టితో కాదుగాని ఒక జాతి చరిత్ర దృష్టితో చూచినట్లయితే తప్పక పునర్ముద్రించ వలసిన వానిలో ఒకటి. సంఘాభిమానులెవరైనా అందుకు పూనుకుంటారని ఆశిస్తాను.

* *

బాపిరాజుగారు తన కథల్లో ఆంధ్రోద్యమాల్ని గురించి, స్వాతంత్ర్యోద్యమాల్ని గురించి, సమకాలీన రాజకీయ విషయాలని గురిచి,లలిత కళలను గురించి, జాతి మత కుల వేదాంత కళల్ను మున్నగు విషయాలను గురించి సంభాషణల ద్వారా చర్చిస్తారు. ఆయన సంభాషణలు చదువుతూంటే పాత్రలు, కళ్ళ ఎదుట కనిపిస్తాయి సంభాషణాచాతుర్యంలో బాపిరాజుగారు సాటిలేని మేటి.

ఆయన సంభాషణలు సహజంగా. స్వాభావికంగా, వివరణాత్మకంగా, ప్రయోజనాత్మకంగా ఉంటాయి.ప్రధాన కథకు ఎటువంటి అంటకాల్ని కలుగ జేయవు. అంతే కాక కథకు అతిసన్నిహితంగా, సంభాషణలు సాగుతాయి కథకు సంబంధం లేని సంభాషణలు బాపిరాజుగారి కథల్లో కనబడవు. అదే ఆయన సంభాషణల్లోని ప్రత్యేకత. వీరి సంభాషణలు చిన్నవిగా ఉంటాయి. వీనిని కొన్ని విధాలు గా వర్గీకరించవచ్చు ఈ విభజనను సోపపత్తికంగా పరిశీలిస్తే బాపిరాజుగారి సంభాషణా చాతుర్యం వ్యక్తమౌతుంది.

## 1. కథకుడే ఒకపాత్రై మరో పాత్రతో సంభాషించడం

కథలో తానే (రచయితే) ప్రధాన పాత్ర వహించి మరో పాత్రతో మాట్లాడటం. 'సూర్యసుత' కథలో బాపిరాజుగారు ముఖ్యపాత్ర ధరించి కథానాయిక సూర్యసుతతో మనోజ్ఞంగా మాటలాడుతారు.

'నువ్వు కళాతపస్వినివి కావా?
కళకోసం, కళావధికోసం,
కళాపరమార్థంకోసం ఎన్ని
సంవత్సరాలనుండో మనస్సులో,
భౌతిక జీవితంలో
హృదయాలలో వెదుకుతున్నాడు.
అందుకనేకదా! నేను నీ ఎదుట
సాక్షాత్కరించింది? రాత్రి త్రివేణీ సం
గమ పవిత్ర దర్శనము చేతువు గాని!

## 2. పాత్రల తెర వెనుక కథకుని సంభాషణం

కొన్ని కథల్లో పాత్రలు మాట్లాడినట్లు అనిపించినా కథకుడే తెర మరుగున ఉండి తన అభిప్రాయాన్ని సంభాషణ ద్వారా కమనీయంగా చెపుతాడు. ఇటువంటి సంభాషణలు 'వింధ్యాచలం', 'సంగమేశ్వరం,' 'వడగళ్ళు' కథల్లో కన్పిస్తాయి.

## 3. పాత్రోచిత సంభాషణం

బాపిరాజుగారు తన కథల్లో ఆయా పాత్రలకు అనుగుణంగా పాత్రోచిత భాషను ఉపయోగించి పాత్రలకు, తద్వారా కథలకు సహజత్వాన్ని కలుగ జేశాడు 'లచ్చిమి' కథలో పచ్చలయ్య, పైడమ్మల సంభాషణ ఇందుకు పరిమోదాహరణ ఇందులో వీరిద్దరి భాష, ఉచ్చారణ గ్రామీణుల సంభాషణలకు ప్రతిబింబాలు.

పచ్చలయ్య : పైడమ్మా! నీవన్న దంతా
సత్తెమే! నాను మాత్రమేటి చేసేది
తల్లీ! బగవంతుడు రచ్చించాల.ను వెళ్ళి
ఏ అమ్మవారికో దణ్ణా లెట్టుకుంటూ
ఉండంతే!

పైడమ్మ బాబూ నన్ను కుంపెత్తడు
నీ అల్లుడు.నాకు బయమేత్తదయా...
కమ్మ కత్తి నాకొక్కని నాకాడి
కొచ్చాడు.యేటి సేయమంతవు పచ్చ
లాయి బాబూ?

### 4. సంభాషణల ద్వారా పాత్రల స్వభావం

రచయిత సంభాషణల ద్వారా ఆయా పాత్రల మనస్తత్వాన్ని సాక్షాత్కరింప చేశారు. 'అశ్రుబిందువు' కథలో ఒక వ్యాపారస్థుని వేల రూపాయలతో కూడిన 'పర్స్' బంగారు షాపుదగ్గర పడిపోతుంది బిచ్చకత్తె ఆ 'పర్సు' ను చూసి దాచి, వ్యాపారస్థుడు వచ్చాక ఆతనికి ఇస్తుంది వ్యాపారస్థుడు ఆశ్చర్యం చెంది, బిచ్చకత్తెతో ఈ డబ్బు పట్టుకొని యింటికి వెళ్ళలేకపోయావా అని అంటాడు బిచ్చకత్తె, నాకు ఒక పైసా సరిపడుతుంది ఆ డబ్బంతా నాకొద్దని చెపుతుంది ఆ సమయంలో వాళ్ళిద్దరికి చక్కని సంభాషణ జరుగుతుంది.

'నాకు మీ రియ్యాదలచుకొన్న
బిచ్చం ఇయ్యండి
అయితే ఏమీ యీయకు
నా అదృష్టం
ఒక నూరు రూపాయల నోటు ఇస్తాను
నువ్వు పుచ్చుకతీరాలి
వద్దు దొరా! నా పైసా నాకియ్యండి.
ఇష్టముంటే అణా యివ్వండి'

ఈ సంభాషణ ద్వారా బిచ్చకత్తె యొక్క నిజ స్వభావాన్ని ఆవిష్కరించాడు కథకుడు.

### 5. సరస సంభాషణం

'తూలికా నృత్యం' కథలో వాణీ సుందరి నరసింహారావుల సంభాషణ సరస సంభాషణం. ఇటువంటి సంభాషణలు, కథను శోభావంతం చేస్తాయి

'ఏమండోయ్ ఓబలయ్యగారూ! నా ఆజ్ఞలను పరిపాలిస్తా మన్నారు. మరచి పోకండి. వివాహమహోత్సవం కాకుండానే అధికారం చెలాయిస్తా వేమిటి? ఇదివరకే మనస్సులు, ఆత్మలు కలిశాయి. ఇంక దేహాలు మాత్రం కలియాలి.అంచేత నాకు సగం అధికారం వచ్చింది. సగం తలుపు తెరవడం, సగం తలుపుమూయడం.'

### 6. హాస్య సంభాషణ

బాపిరాజుగారు స్వయంగా హాస్యప్రియులు. తన కథా సాహిత్యంలో అనేకచోట్ల మనోహరంగా హాస్యసంభాషణల్ని చేశారు 'టాంపదళం' కథలో నీనా, రావుల సంభాషణ హాస్య సంభాషణకు ఉదాహరణ.

### 7. చిన్నపిల్లల సంభాషణ ·

'కొండపైన కోవెల కొండ క్రింద కొలను' అనే కథలో చిన్నపిల్లలైన రుక్మిణి, నరసింహుల సంభాషణ కడు రమణీయంగా ఉంది.

### 8. స్వగత సంభాషణం

ఒక పాత్ర తనలో తానే మాట్లాడుకోవడం స్వగత సంభాషణ ఈ సంభాషణ ఏకపాత్రాభినయం వంటిది. దీనిని ఆత్మసంవాద మని కూడా అంటారు.

'హిమాలయవల్లి' కథలో రామానంద లాల్జీ తన మనుమడిని హుగ్లీ నదిలో పార వేద్దామని అనుకుంటాడు. ఇంతలో 'ఏమి వెఱ్ఱి బ్రాహ్మణుడా నీకా పిల్లలు లేరు భగవంతుడు ఈ బాలుణ్ణి నీకు ప్రసాదించాడోయి' అని ఎవరో గంభీర స్వరంతో తన చెవిలో పలికినట్లు అనిపిస్తుంది. అపుడు రామానందలాల్జీ అనుకొన్న మాటలు స్వగత సంభాషణకు మంచి ఉదాహరణ

'తన హృదయం కర్కోటకం కాదు.
తాను కటికవాడున్నూ కాదే! భగవంతుడా
దారేది? తెన్నేది?
ఎవరికైనా పెంపకం ఇస్తే!
ఎవరు తీసుకుంటారు?
తానే పెంచుకోవాలా ??
ఎట్లా ???
ఎవరి పిల్లాడ్నో పెంచుకు నేందుకు తీసుకు వచ్చావంటే ఎవ రేమంటారు.
దిక్కులేనిపాపడుదొరికాడనవచ్చుగదా!'

### 9. ప్రశ్నోత్తర సంభాషణం

కొన్ని సంభాషణలు ప్రశ్నల పరంపరతో సాగుతాయి. 'వసుబాలుడు' కథలో వసుబాలుడు తనకు కలిగిన అనుమానాల్ని తీర్చుకోవడం కోసం అరవింద దేవితో ప్రశ్నల వర్షం కురిపిస్తూ మాటలాడుతాడు.

### 10. వాదప్రతివాద సంభాషణం :

ఏదైన ఒక విషయాన్ని తీసుకొని చర్చించడం వాదప్రతివాద సంభాషణ. 'సంగమేశ్వరం' కథలో కృష్ణవేణి నరసింహారావులకు ప్రత్యేకరాష్ట్రం సమస్యపై వాగ్వివాదాలు వస్తాయి. ఈ సంభాషణ చాలా బాగా సాగుతుంది-చివరికి. కథకుడు రాష్ట్రసమస్య విడిచిపెట్టి, దేశ సమస్య గురించి పాటుపడ మని హెచ్చరిస్తాడు.అసలు రచయిత ఈ కథ వ్రాసింది కూడా అందుకోసమే.

'ద్వేషం' కథలో కూడా విశ్వేశ్వర రావుకి ఆంగ్ల బాలికలకు వాదోపవాదాలు వస్తాయి. 'వింధ్యాచలం'లోని సంభాషణలన్నీ వాద ప్రతివాదానికి సంబంధించినవి.

### 11. అనుసరణ సంభాషణం

ఒక వ్యక్తి ఒకమాట అన్నప్పుడు మరోవ్యక్తి ఆ మాటనే స్పష్టం చేయడం అను సరణ సంభాషణ. 'వింధ్యాచలం' కథలో ఆనందమయి, త్రివేణి, జ్యోతిర్మయిల సంభాషణ ఇందుకు ఉదాహరణ,

### 12. ఆశ్చర్యసంభాషణం

'అసురకన్య' కథలో తహిమినా, వైకుంఠరావులు అనుకోకుండా ఒకచోట కలుస్తారు. అప్పటివాళ్ళ సంభాషణ ఆశ్చర్య సంభాషణం.

శంభో! జయ ప్రణమ దంభోజనాభ విధి
  డంభోళి పాణి తరణే!
రంభోరుగాఢ పరి రంభోపభోగ దివి
  రంభోపగీతి సతతమ్।
స్తంభోదయ ప్రణత జంభోపఘాతికకు
  దంభోపకల్పిత జనే!
రంభోదర ప్రతిమ శంభో! జయామలవి
  డంభోధి వర్ధన విధో!'

యథా:-

మందాకినీ పులిన మందార దామకర
  బృందార కార్చిత విభో!
నారాయణ ప్రఖర నారాచ విద్ధపుర
  నారాధి దుష్కృత కథా।
గంగాచలాచలిత రంగాకలీ ముకుట
  రంగావనీ మతి పటో!
గౌరీ పరిగ్రహణ గౌరీ కృతార్ధ కర
  గౌరీ దృశీ ప్రతిగతా॥

యథా వాస్మద్వృద్ధ ప్రపితామహ పండితముఖ్య శ్రీమద్రామచంద్ర భట్టకృత నారాయణాష్టకే-

వందాతిభాను శరదిందా వఖండరుచి
  బృందావన ప్రజవధూ॥
బృందారకచ్ఛలన మందార హాసకృత
  నిందార్ధ వాదకథనమ్।
వందారుబిభ్యభర విందాసనస్తుభిత
  బృందారకేశ్వర కృత॥
చ్ఛందాను వృత్తి మిహ నందాత్మజమ్
  ఘనా నందాకృతిం వ్యాది భజే॥

ఇత్యాది మహాకవి ప్రబంధేషు శతశః ప్రత్యుదాహరణాని.

6. 'వాగ్వల్లభము'లో దుఃఖభంజనకవి దీనిని 'సిత స్తబక' వృత్తమని నుడివినాడు

'ఉక్తం సిత స్తబకవృత్తం తథా యజస
  రా నో గురు ర్యది తదా'।

దుఃఖ భంజన కవి తరువాతివారలైన మహామహోపాధ్యాయ శ్రీ దేవీప్రసాద కవి చక్రవర్తులు దీనిని 'పరి స్తబక' మని 'అశ్వధాటి' యని వాగ్వల్లభ వ్యాఖ్యలోఁ జెప్పినారు 'ఉక్తమితి, యది ప్రతి పాదం తగణ - భగణ - యగణ-గగణ-సగణ - రగణ - నగణ - గురవః స్యుస్తదా సిత స్తబక నామకం వృత్త ముక్తమ్। శేషే నేతి శేషః। 'పరి స్తబక' ఇత్యపి నామాస్య బోధ్యమ్। 'అశ్వధాటీ' ఇత్యపి నామాస్య కేచి ద్వదంతి'.

ఈవిధముగా నీ యశ్వధాటీ వృత్తమునకు మత్తేభము, మదాలసము, సిత స్తబకము మొదలగు నామాంతరము లున్నను శ్రీకాళిదాస మహాకవి రచించిన 'చేటీ భవన్నిఖిల ఖేటీ' యను దేవీస్తుతి శ్లోకము లశ్వధాటీ వృత్త మనియే లోకములో వ్యవహారము.

చేటీభవన్నిఖిల ఖేటీ కదంబవన
  వాటీషు నాకపటలీ
కోటీర చారు తర కోటీ మణీకిరణ
  కోటీ కరంబితపదా।
పాటీర గంధికుచ శాటీ కవిత్వ పరి
  పాటీ మగాధి పసుతా॥
ఘోటీ కులాదధిక ధాటీ ముదారముఖ
  వీటీ గసేన తనుతామ్।

అను శ్లోకములో 'ఘోటీకులా దధిక ధాటీమ్' అని వడి యీ వృత్తనామ మశ్వధాటి యని కాళిదాసు ధ్వనింపఁ జేసినాఁడు. అందువల్లనే యిందు ముద్రాలంకారము.

సూచ్యార్థ సూచనమ్ ముద్రా
ప్రకృతార్థ పరైః పదైః।
నితంబ గుర్వీ తరుణీ
దృగ్యుగ్మ విపులా చ సా॥

అని కువలయానంద లక్షణము.

కాళిదాసు నాటికే దీని కశ్వధాటి యను పేరు ప్రసిద్ధమైనచో లాక్షణికులందీని నశ్వధాటి యని యేల పేర్కొనరే దన్నచో వినుఁడు ఏ వృత్తముయొక్క లక్షణ మాతృవృత్తము నందే చెప్పవలయును నని ఛాందస మర్యాద. అశ్వధాటీ పద మశ్వధాటీ వృత్తములో నిముడదు. అందువలన నశ్వధాటిని మత్తేభ వృత్తమని లాక్షణికులు వ్యవహరించిరి.

ఇపుడు దీనిలక్షణము చెప్పఁబడు చున్నది.

అశ్వధాటీ వృత్తమునందుఁ బాదమునకు 22 అక్షరము లుండుటచే నిది యాకృతి చ్ఛందోజాత మని స్పష్టము. ఆకృతి చ్ఛందసమునందుఁ బుట్టిన వృత్తములలో నిది 1925 509 వ వృత్తము. ఇందుఁ బ్రతిపాదమునందు 'తభయజ సరనగ' గణము లుండును. 7-14 అక్షరములు యతిస్థానములు 8-15 యతిస్థానములలోఁ బ్రాసయతి యుండ వలయును. అనఁగాఁ బాదమునందు 2-9-16 అక్షరములు సమముగా నుండ వలయును. ప్రాసాక్షర మనుస్వార యుక్తమైనచో సర్వత్ర ననుస్వార యుక్తము, ద్విత్వాక్షరమైనచో సర్వత్ర ద్విత్వాక్షరము, సంయుక్తాక్షరమైనచో సర్వత్ర సంయుక్తాక్షరము నుండవలయును.

సానుస్వారాక్షర ప్రాసము.

సంసారలంపటరి రంసాత్మకస్యమమ
  కంసాది రేవ శరణమ్

ద్విత్వాక్షర ప్రాసము.

ఉల్లోలజన్మ మృతి కల్లోలినీ కలిత
  హల్లోహలస్థ మవ మామ్

సంయుక్తాక్షర ప్రాసము.

దుర్గాం తనూఘటిత భర్గాం నమద్దివిజ
  వర్గాం నమామి సతతమ్

ప్రాస విషయములో నాంధ్రులచే హల్సామ్యము మాత్రమే స్వీకరింపఁ బడినను గమన సౌందర్యమునకై యశ్వధాటీ వృత్తమునందు హల్సామ్యముతో పాటుగా నచ్సామ్యమును గూడ గ్రహింప వలయును.

'వీణాధరామ్ భజత వాణీం సదాచరణ
  రేణూల్లసన్మునిగణామ్'

అని చరణమును నిర్మించినచోఁ బద్య సౌందర్యము మందగించుటయే కాక కర్ణ

# ఆధునికకవిత్వంలో కొత్తపుంత వేగుంట "చితి - చింత"

- శ్రీశాస్త్రులు అమరేంద్ర ఎం. ఏ.,

ఆధునిక వచన కవితాప్రక్రియనే ప్రధానంగా ఎంచుకొని పాశ్చాత్య విధా రీతుల్ని బాగా పుణికిపుచ్చుకొని నూతన ప్రయోగాల సరళిలో, ప్రత్యేకమైన ఒరవడిలో రచనలు చేస్తున్న తెలుగు కవులలో శ్రీ వేగుంట మోహన్ ప్రసాద్‌ను ప్రముఖంగా పేర్కొనవచ్చు. మారుతున్న సమకాలీన సామాజిక పరిస్థితుల ననుసరించి తెలుగుకవిత్వపు పోకడల్లో కూడా మార్పులు వచ్చాయి. ఆ విధమైన మార్పులతోనే తెలుగు వచన కవిత్వానికి వేగుంటవారు క్రొత్త గవాక్షాలు తెరిచారు. ఈయన వెలువరించిన 'చితి-చింత' కవితా సంకలనం అందుకు తార్కాణం. ఒక్కసారిగా పాశ్చాత్యసాహిత్య - పోకడలతో తెలుగు సాహితీ క్షేత్రంలో మెరిసిన ఈ సంకలనం అనేక విమర్శలకు కూడా గురయింది. ఇందులో అధికక్లిష్టత, అన్వయక్లిష్టత చోటుచేసుకున్నా యని పలువురు అభిప్రాయపడ్డారు. అయితే కవిత్వాన్ని కేవలం మానసికానందానికే వుపయోగపడే సాధనంగా కాకుండా మానవుడి విజ్ఞానమందిరంలోకి చొచ్చుకపోయే ఆలోచనాత్మకమైన సాధనంగా ఎంచి మోహన్ ప్రసాద్ తన కవితా సౌరభాల్ని సాహితీలోకంపై వెదజల్లారు.

మోహన్ ప్రసాద్ కవిత్వంలో భావన, ధ్వని, కావ్యవస్తువు ప్రధానంగా గోచరించే కావ్యస్వరూపం (*Aesthetic surface*) క్లిష్టతతో రూపొందినట్టుగా అనిపిస్తుంది. స్పష్టాస్పష్టంగా గోచరించే కావ్యస్వరూపం ద్వారానే పాఠకులను ఆలోచింప జేయాలని కవి ప్రయత్నిస్తాడు. ఇక్కడే కవి చెప్పదలచుకున్న విషయాన్ని పాఠకులు 'పలురకాలుగా 'రసీవ్' చేసుకోవలసి వస్తుందని విమర్శకుల అభిప్రాయం. స్వతహాగా ఆంగ్లోపన్యాసకుడు కావడం మూలాన మోహన్ ప్రసాద్ మీద ఆంగ్లసాహిత్య ప్రభావం అధికంగా వుంది ఆయన తన ఖండికల్లో పలుచోట్ల పాశ్చాత్య సాహిత్యప్రభావాన్ని చెప్పుకున్నాడు. విస్తృత జీవితానుభావాలలోతుల్ని స్పృశిస్తూ మనోవిశ్లేషణనే ప్రధానంగా వర్ణిస్తూ శక్తిమంతమైన పదజాలంతో నిశితమైన భావనాధారలను ప్రవహింపజేసిన మోహన్ ప్రసాద్ కవిత్వమంతటా సమాజంచే బాధింపబడుతున్న నైరాశ్య జీవన స్థితిగతులు కనిపిస్తాయి. జీవితసంఘర్షణ వలయాల్లో తిరుగాడే మనసుపడే తపన అంతర్లీనంగా ప్రవహిస్తూ వుంటుంది. 'చితి-చింత'కు ముందుమాట వ్రాస్తూ 'మోహన్ ప్రసాద్ సామాన్యవస్తువుల ద్వారా అసామాన్యమైన సత్యాలను ప్రదర్శిస్తాడు తనవచన కవితల్లో పార్థివదృశ్యాల ద్వారా అపార్థివానుభూతులను శేకత్తింపజేస్తాడు' అంటారు శ్రీ సంజీవ్ దేవ్. 'ఆధునిక జీవిత నైరాశ్యాన్ని చావుబ్రతుకుల దుఃఖభూయిష్ఠ సంఘర్షణను వీలైనన్ని ఎక్కువ పదాలతో కుదించి పెడుతున్నాడు' అంటారు రోణంకి అప్పలస్వామిగారు.

కావ్యవస్తువుల్ని అభివ్యక్తీకరించడంలోనూ, ప్రతీకల్ని స్వీకరించడంలోనూ, కొత్త ధోరణులు అవలంబించిన మోహన ప్రసాద్ కవిత్వంలో 'తాత్వికచింతన, అవ్యక్తవేదన, ఆర్ద్రహృదయానుభూతి ప్రధానంగా దర్శనమిస్తాయి. మోహన్ ప్రసాద్ తీసుకొనే కవితావస్తువు అన్నీ ఎక్కువగా మానసిక రుగ్మతలకే సంబంధించేవిగా వుంటాయి. 'నిరీహ' కవితా ఖండికలో ఈ ధోరణి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ ఖండిక ఒంటరితనంలో వున్న కవి మనోభావాలకు ప్రతీక. ఇక్కడ కవి తీసుకున్న వస్తువూ సామాన్యమే చెప్పదలచుకున్న విషయమూ సామాన్యమే కానీ చెప్పడంలో చూపిన ప్రతిభ మాత్రం అనన్య సామాన్యం-

"అట్లా అని
పెద్ద బాధా వుండదు
వెల్ల వెలిసిన గోడలేమో తెల్లబోతుంటాయి
విద్యుత్కాంతికి"

అంటూ కవితను ప్రారంభించడంతోనే తన మనోభావాలకు గదిలోని దృశ్యాలకు అంటే భౌతికఛాయలకు సమన్వయం చేకూరుస్తాడు కవి ఇక్కడ విద్యుత్కాంతి గతాన్ని, వెల్లవెలిసినగోడలు ఒంటరితనంలో నిర్మలమైన హృదయాన్ని తెలుపుతున్నాయి ఆ తరువాతి పాదాల్లో కవి గోడమీద ప్రాకే బల్లిని విషాదానికి ప్రతీకగా తీసుకొని 'కరుచుకు పోయిన బల్లిలా గోడకు నిచ్చెన వుంటుంది కానీ తీరా ఎక్కేవాడెవ్వడు' అని అనడంలోని ఆంతర్యం విషాదానికి ప్రతిమనిషీ దూరంగా వుండాలనే ఆశ. గతాన్ని మరిచే మనిషే ఆన దానికి హేతువవుతాడని కవి భావన.

'ఆఖరి ఆశ్రమం' ఖండికలో మోహన్ ప్రసాద్ మునిగిపోతున్న పడమర దిక్కులో అరుణ వర్ణ పశ్చిమాద్రిని జారిపోతున్న సాయం సంధ్య సూర్యుణ్ణి కమలా కాంతతో పోలుస్తూ ప్రకృతి వర్ణన కూడా చేశారు. నిద్రలో రాత్రంతా వివస్త్రయై పైట సర్దుకుంటూ మనసుపడే ఆరాటాన్ని, ఆవేశాన్ని, తపననూ, 'అనుభవం' ఖండికలో వర్ణించారు. ఆ మనసునే 'త్రికాల బాధితం' ఖండికలో ఇలా వర్ణిస్తారు.

'నిశ్చేష్టిత నిర్బాధిత నిత్యం కంగుతూ వుండే సరసు మనసు
చూస్తూవుండాలి ఏ కమలం ఉబుకుతుందో పైకి'

చేప్ప బుద్ధి నిశ్చలం కావున్నా లోపల్లుంటూనే వుండే పరమ్సతో మనసును పోల్చి అందులోంచి ఉబికి వచ్చే ఆనంద కమలానికి ప్రతీకగా తీసు కోవడం జరిగింది. ఆ తరువాత పాదాల్లో వర్తమానపు విత్తుకూ, భవిష్యద్వృక్షాన్ని మర్రిచెట్టై బాధించే భూతకాలపు భూతాన్ని, వర్ణిస్తాడు కవి. 'చీరంతా పరుచుకున్న కన్నీళ్ళ మడతల్లోంచి కాంతి నక్షత్రాన్ని చూస్తూ, చేయి జారిపోయిన అనంతపు సూర్యుడి అంతిమ కిరణాన్ని తలచుకుంటూ 'నీళ్ళలోనన్నా నిండూ పొల్ని పొందండి,' ఈ జగత్తు సర్వం అనాచ్ఛాదితం' అంటూ ఒక్క నీరు మాత్రమే స్వచ్ఛమైనదిగా, మిగిలిన జగ మంతా కలుషితమైందిగా భావిస్తూ మోహన్ ప్రసాద్ మానవులపట్ల 'సెల్ఫ్ పిటీ' ని ప్రదర్శిస్తాడు.

'ఎగరబోతూ ఎగరబోతూ కేలకూలిన గాలిపటం' ద్వారా దుఃఖంలోంచి, శోకం లోంచి సంశయం విస్మయంలోంచి జీవిత తత్వాన్ని వివరించిన కవి ఆధ్యాత్మిక చింతన 'అతీతం' అనే ఖండికలో పరా కాష్ఠ నందుకొన్నది.

'ఈ దేహాన్ని కాట్నం చూడనో
పురాతన స్మృతి జాగ్రత్తో
నిను బంధించేందుకు రానా
నీ మోల వచ్చి వుటుక్కున తెగనా
ఆనందమయా.

తనిపాపగానో, యోగిగానో ఋషి గానో ఈశ్వరుడు ప్రత్యక్షమవ్వాలని మన సంతా నిండిన తపనతో కోరుకుంటూ ఆ ఆనందమయుని తన పురాతన స్మృతుల తో బంధించేస్తానని కోర్కుంటూ, ఆనా కారి ఆక్రమించే దేహం గొప్పదిగా భావిస్తూ, మోహన్ ప్రసాద్ 'మానిస నశాలలో విరిసిన క్రోధం, ప్రతీకారం ప్రాముఖ్యాన్ని వివరిస్తారు. 'అన్వేషణ' అనే ఖండికలో చక్కని ప్రతీకలతో కూడిన ప్రకృతిచిత్రణ అద్భుతంగా సాగింది. మంచుముసురుకున్న వేళ కేవల దృశ్యాన్ని మోహన్ ప్రసాద్ ఇలా వర్ణిస్తారు.

'గాలీ వచ్చింది
వానా వచ్చింది
మంచూ పట్టింది
తనకొంగంతా చెట్లముఖాలమీదకప్పి
ఊపిరాడక కొమ్మలూ, రెమ్మలూ తోసే
స్తున్నాయి.'

మంచు తన తెల్లని కొంగుతో చెట్ల ముఖాల్ని కప్పే మాదిరిలా కవికి కనిపించింది 'ఊపిరాడక కొమ్మలూ రెమ్మలూ కొంగును తోసేస్తున్నాయనడం సూర్య కిరణాలకు మంచు కరగడాన్ని సూచి స్తుంది. పలు ఖండికల్లో మోహన్ ప్రసాద్ నిశితపరిశీలనా దృష్టి కనిపిస్తుంది. ముగ్గు పోడిబెట్టి తుడిచిన లాంతరు గ్లాసుని కడి గిన నీళ్ళు తడినంటి దశదిశలా వ్యాపించే వెలుగుచుక్క మెరపులో క్రీస్తునీ, గాంధీతాతనూ, కృష్ణమూర్తినీ దర్శిస్తా డీ కవి. అందుకే 'జీవన ద్వారతీర్థం' ఖండికలో అంటాడిలా.

'అంతరంగాన్ని ముగ్గుపోడిబెట్టితుడవాలి
దయా స్పర్శతో తుడవాలి
అందాకా ఆనంత ప్రతిడి వంటిన వెలుగు
చుక్క మెరవదు.'

ఇక్కడ కవి మనసును లాంతరు దీపం తోనూ, దురాగుణాన్ని ముగ్గుపోడి తోనూ, వెలుగుచుక్కను ఆత్మతోనూ పోలుస్తాడు. మలినమైన మెరగని హృద యాన్ని దయాగుణంతో శుభ్రపరిస్తే ఆలోచనలు వెలుగుతా యని కవి భావన.

మోహన్ ప్రసాద్ తనలోని తంటాపు లితునిగా, కాంథా జ్వలితునిగా, నిర్భర ఊత గాత్రునిగా భావించుకుంటూ 'మేని మీద వర్షపు చినుకుల్ని, వర్షపు పూల ల్ని, గాయత్రి కలల్ని గమనిస్తూ 'తీరవృక్షం' ఖండికలో చక్కని మనో విశ్లేషణ గావించారు. 'స్వప్నాల్లో సర్పాలు' ఖండిక ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రాతిపదికగా రచించబడింది. ఈ ఖండి కలో కవి కోరికలను సర్పాలకు ప్రతీక లుగా తీసుకొని ఆ కోరికల పాముల తగిలి తేళ్ళ దేహాలు 'కరెంట్ స్తంభాన్ని అల్లు కొని పైకెగబ్రాకే పాము ఐంతుల్లో తుక్కు మని వెలుగుతా యని అంటాడు. 'హిమానీ హృద' అనే ఖండికలో మోహన్ ప్రసాద్ హృదయానికి చక్కని నిర్వచనమిస్తాడిలా.

'ఆత్మకూ దేహానికి కలిపే వచ్చి దిక్కు తెలిసే
ప్రేమ అనే దరిద్రపు కుడ్డిదీపం
వెలిగించేక్క ఇక్కడనే
హత్యలు ఆత్మహత్యలు ఇదే బలిపీఠం
స్వర్గసీమ, వల్లకాడు రెండూ ఇదే'

చివరి రెండు పాదాల్లో ఎంతో నిశిత మైన భావాలు ఇమిడివున్నాయి. మనసు ఒకప్పుడు స్వర్గసీమగా మరొక్కప్పుడు వల్లకాడుగా రూపాంతరం చెందుతూ వుంటుందని కవిభావన.

ఒక వేసవిలో గిలకబావివద్దర జరిగే ఒక సామాన్యమైన నిత్య కృత్యాన్ని మోహన్ ప్రసాద్ 'ఒక వేసవి' అనే ఖండికలో అద్భుతమైన భావనతోనూ పదజాలంతోనూ ఇలా వర్ణిస్తాడు.

'గిలక బావి
బావి అంచున బిందె
బిందెను ఊరేసిన చాంతాడూ,
జిప్పు మూతే
బావిలో నీళ్లు కొరకరాని కొయ్యలు
కీఁ కీఁ కీఁ గిలక నిక్వాణం
గిలకమీంచి బిందెదిగే చప్పుడు'

నిక్వాణాన్ని వినిపించే గిలక మీదనుంచి బిందె దిగుతున్న చప్పుడులో కూడా కవి త్వాన్ని చొప్పించడం కవి ప్రతిభకు తార్కాణంగా భావించవచ్చు. 'అను భూతి' అనే ఖండికలో మోహన్ ప్రసాద్ అనుభూతికవిగా దర్శనమిస్తాడు. తన హృదయం పొందిన ఒకానొక 'అవ్యక్త'

ప్రా చైతన్యానుభూతి'ని ఇలా వ్యక్త పరుస్తాడు.

"పురందరదాసు కీర్తనేదో
ఒక మధ్యాహ్నం
బాటసారెక్కడో పాడుతున్న ఎండలోకి
చూస్తూ నాదస్వరంతో విన్నప్పుడు
'ఆ మేఘాలు కదలాడినయ్
గాలి పిచ్చిగా పర్వెట్టింది'

నిట్టమధ్యాహ్నంలో కూడా పురందర దాసు కీర్తనకు కవి హృదయం చలించిన తీరు ఇక్కడ మనకు కనిపిస్తుంది. మేఘాలు కదలాడడం, గాలి పిచ్చిగా పర్వెట్టడం ఆ అనుభూతిలో కవి పొందిన ఆనందానికి ప్రతీకలు. అందుకే ఆ ఆనందంలో ఆనాదంలో జగత్తంతా శోభతో పూచి' నట్టు అనిపించింది కవికి.

ఒంటి కిటికీ మూసెల్లొంది దీపం బయటికి పర్చుకోవడం, నిర్భ చంద్రుని నాల్కలు లాగిపెట్టి సాగదీసి దాహం తీర్చడం, ఖంగు ఖంగుమని దగ్గుతోన్న ముసలాతతో జట్టు పైకెగరున్వుకొని పోతోన్న రైలుబండి లాంటి ప్రయోగాలు చేస్తూ 'దుఃఖాల అశ్రువుల్ని పేర్చుకొని, చితికార్చుకుంటూ కట్టెల్తో ఊదాంగు మంటల్ని వెచ్చ జేసుకుంటూ' 'జీవాన్ని పూగుఙంటూ! ఏదో అనంతమైన వేదన నిశ్చేతనాంతర్యం' ఆస్వాదిస్తూ 'దుఃఖాన్ని అంటుకోకుండా ఎవడీ పాదరక్షలే భూమ్యాద నడవ' మంటూ జనం 'అంత ర్యాలోంచి రాలి ఆవరణ' గా, మరణం 'ఆవరణ ప్రాకారాలు కూలిన అంతిమ్యం' గా భావిస్తూ 'అంతరంగంలో ఎప్పుడో గాని వెల్గని ఆ ఒక్క ఆశాబిందువుని పైతం అలాగ్గా ఆర్పి తానే జీవనమై వాతా ద్ధ్య మిచ్చే ఘుణుగుణులోనూ' వైరాగ్యాన్ని దర్శిస్తూ 'వృద్ధ వృక్షం సమూలంగా లేచి మహాపర్వతంలో ఓ చిన్న రాతిగోని వరాలతో పాటు వేస్తూన్నదానికి కారణమయే యువచైతన్యమనే 'పిల్ల గాలి' కోసం పిలుపు నిస్తూ కవితారచనను సాగించారు మోహన్‌ప్రసాద్.

---

## చిట్టిబాబు వీణాగానము

— కవిరత్న శ్రీవసంతరావు రామకృష్ణ రావు ఎం. ఎ.,

* నీ కొనగోటి మీట రవ
 ణించిన వీణియనాదమందు, న
స్తోకతరంగ కల్పములు
 శ్రోతల వీనుల విందు సేసి; వి
ద్యాకలితుండవైన భవ
 దద్భుత వైణిక ప్రాభవంబుతో
నా కవనంబు సంతసము
 నన్ వెలుగొందు నటంచు కెంచెదన్!
*వీణావాదన విద్యయందు భువిలో
 వేరెవ్వరున్ సాటిగా
రాణింపంగలరే? సరస్వతికిగా
 రాబంపు పుత్త్రుండవై
వాణీదేవి విలాసవైభవముకన్
 వర్ధిల్లగాజేయు ని
క్వాణంబున్ విని మోదమందదురుసం
 భావ్యాను భావంబుగన్!
*సాహిత్య సంగీత సామ్రాజ్య మేలెడు,
 వలువ పడంతికి నతులు సేసి,
విఘ్నంబు వారించి నిబుధుల పాలించి,
 యలరెడు గణనాథు నర్చ సేసి,
తనగానమాధుర్యమున సంతసము గూర్చ
 నారద మునికి వందనము లిడుచు,
గానముచేత రాల్గరిగింప జేసెడు
 కిన్నెరులకు నమస్కృతు లొనర్చి,
నీదు వీణాప్రభావంబు నిరతిమధుర
భావ మెలయంగ చేసెడు, ఫణితి చూచి
నావు నీ దగు విద్య సన్మాన్యమయ్యె!
వైణికులలోన నిక్కీర్తి వరలుగాత!
*మధుర మోహనరాగ సంపదల కూర్చి
వైణికుడ వైన యోచిట్టి బాబు! నీకు
వాయురారోగ్య భాగ్యము లందజేసి
వాణి గాపాడుగాత! వైభవముతోడ.
 (విశాఖనగరములోని,వివేకానందమంది
రములో చిట్టిబాబుగారి వీణావాదనమున
కలిగిన నాభావమున కిప్పు యొకకల్పనము)

---

## శరచ్చంద్రిక

— శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి బి.ఏ బి.యిడి.

శారదవేణి తక్కులప
 సంగుల దొంతర, ప్రేయసీ ప్రియుల్
కోరి వరస్పరంబుగడు
 గుట్టుగ జాబిలి చేత బంపు నిం
పారెడు ప్రేమలేఖలహో
 యల్ జగి, శారదచంద్ర చంద్రికా
చారణ రాత్రులన్ నయన
 పర్వ మొనర్చుచునుండె గంటిరే?
జగతిన్ సాంద్రముగాగ బూచినవి పు
 చ్చల్, తన్నిశాకాంత తా
గగనంబే వసనంబుగా బఱచిచ
 క్కన్ దానిపై బిండినా
రంగంబోసెన్ జామి యన్న భావము తెల
 ర్పంగా శరచ్చంద్రికల్
మిగిలెన్ స్వచ్ఛత రామృతప్రస్రుత సౌ
 మ్యాచీనభద్రద్యుతిన్!
వెన్నెల కారు కాప కుచి
 వెన్నెల పుల్గులకెల్ల దృప్తిగా
వెన్నెలవిందు సేసి, కను
 విందొనరింపగ ప్రేక్షకాళికిన్,
వెన్నెల వన్నెగ నద్దగని
 పించుచు నుండిన సర్వదేవతా
సన్నుతిపాత్ర శారదయె
 శారద, వెన్నెలలన్ ఘటింపరే!
ఇలనాకాశ విశాలసౌధముక్ర మ్రా
 వృక్షఘముల్ క్రమ్మిబూ
జాలు దట్టంబుగ బట్టిన ట్లగపడన్
 శుభ్రాంశు డవ్వానినిన్
దొలగన్ ద్రోయగ జేసి,స్వచ్ఛతముకాం
 తుల్ నల్దెసల్ జిమ్ముగా,
విశసున్నంబున వెల్లవేసెనని భా
 వింతున్ శరచ్చంద్రికన్.
గగన మె యారకూట పరి
 కల్పిత పాత్రము, వాడకంబుచే
నగపడకుండె బోయినది
 కాంతములోని కళాయి, చంద్రుడక్
దగరముతో శరత్తెడు
 దంట ... కాకొక కార్మికుడు కా
ంగతి తలంచి పెట్టిన క
 ళాయిరుచూ శరదిందుచంద్రికల్!



కష్టాత్త్రికరణ మొప్పఁగక, పుట్టిన దురితముల నప్పుడ పొలియింపని యా
కట్టిఁడి దేహం బుడిగినఁ, గొట్టాడును బట్టు నరకకూపంబులలోన్.

కావునఁ గాల కింకర వికారము గానకమున్న మృత్యుదు
ర్భావనఁ జిత్తమున్ వడఁకుపాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్లుచుండఁ దన చెల్వము దప్పకమున్న పన్నుగాఁ
బావనచిత్తుఁడై యఘముఁ బాయుతెఱం గొనరింపఁగాఁదగున్.



సమాలోచన 3,4,5,6,7,8,9,10వార్షిక సంపుటముల వెల వరుసగా 20, 20,12,15,15,15,15,20రు. లు ఎం. ఓ. చేసినవారికి ఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

— సంపాదకుడు.

అడ్రసు :—
సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. కె. కాలేజి,
6–4–24, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్),
రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispeta, (Tyagaraja Nagar, Rajahmundry-1.